క. తోడుకొనిపోయి మిక్కిలి
వేడుకతోఁ బాలు పోసి పెంచుచు దానిం
గూడి పెఱపనులు విడిచియు
నాడుకొనుచు నిలిచె భరతుఁ డదియే పనిగాన్. 28

శా. నీట న్మున్గుట సందె వార్చుట తఱి స్నిర్వాపలో వేల్చుటల్
గూటంబుం బెడఁ బాపుఁబున్నెపుగతల్ లో నెంచుట ల్గోలె నా
పాటింపం దగుమంచికర్జములునుం బ్రాల్మాలి పోకార్చె నా
నీటం బట్టినలేటిపిల్లకొఱకై నేమంపురాయం డొగిన్. 29

క. గారాబంబున నట్టులు
గోరికమెయిఁ బెంప లేడికూనయు నానాఁ
డేరికిని నింపు గూరెడు
తీరున మే నొప్పఁ బెఱిఁగెఁ దే జలరంగన్. 30

తే. కఱఁగి పోసినబంగారుకరణి దాని
నిగనిగలు వొల్చి నలుగడఁ దగులుకొనుచుఁ
గదియ వచ్చినయెల్లరకన్నుఁగవకుఁ
బొల మదెల్లను పచ్చ యన్పొలుపు గొలుపు. 31

ఉ. సోయగ మేర్పడ న్నిలిచి చూచుచు మేనుఁ గదల్పకున్నచోఁ
బాయక చెంతఁ జేరి కనువారును నిక్క మెఱుంగ లేక మేల్
చాయ నెసంగుసొన్నమున సల్పినరూ పిది ముట్టెయుం గనుం
దోయియు వేల్పురాఱవలతో నగు నంచుఁ దలంతు రెంతయున్. 32

ఆ. మూడుకాళ్ళ నిలిచి మోమటు మరలించి
వెనుకకాలిగోరిజ వెసఁ దగిల్చి
కన్నుఁ గోఁకికొనెడుకడునేర్పు గాంచినఁ
గనులపండు వగును గాదె పజకు. 33

ఆ. కోడెకాడు మిండగీడు నయినవాఁడు
సొగసుకత్తె తనదుసోయగంబుఁ

గనెడునప్డు దానికనుచూపునకుఁ జొక్కు
కరణిఁ జొక్కు దానికనుల జగము. 34

వ. ఆప్రాచదబిసియు ని ట్లల్లారుముద్దుగ నున్ననాయిఱ్ఱిపిల్లఁ దనయునికి పట్టునం బెట్టుకొని యెడతెగనికనికరంబునఁ గూరుచుండెడునపుడును బండుకొనెడునెడనను నీ రానెడునదనునను బూలు బత్తిరిఁ బండ్లనుం దెచ్చునజ్జనను వేల్పులం గొలుచుతఱిని దనయొద్దన నునుచుకొనుచుఁ బులి సింగం బెలుఁగు తోడే లేడిక లోనగునడపిమెకంబులవలనిబీతునఁ బొలంబుల వెనువెంటం దిరుగులాడుచుఁ గొంతదనుక బుజంబుల నెక్కించుకొని మోయుచు మఱికొంతసేపు తొడలమీఁదం గూరుచుండం బెట్టుకొని ముద్దులాడుచు నొక్కింతతడవ వక్కునం జేర్చుకొని సంతసించుచు నదియ పనిగా నుండి నిచ్చలునుం జేయుచేఁత లంద దుకులుగా నెడనెడ లేచి చూచుచుఁ బెక్కెండ్లు బ్రదుకు మని దీవించుచు నంతలపొంతల దనక చెంతఁ జేర్చుకొని మిక్కిలి చెలిమిం జేసి యక్కఱగండఁగై యాఁకలంబులును దుంపతూండ్లును గడ్డికసరులును బాలునీళ్ళునుం బోసి పెంచుచుండె న ట్లంటసిల్లి పెరుగుచున్న యాజింకపిల్ల యొక్కనాఁ డేరెకినిం గానరాకుండఁ గిరురించి చొఁకళించి యెటయే నూడనింబాడె నంత నాతండు దానినెంతయేఁ దడ వబ్బాలాడుచు నెమకియుం గాన కక్కిలిపడి తన్నుఁ బెడఁబాసిపోకకు మిగులవగలం బొగులుచు దాని నెడఁదం దలంచుచు ని ట్లని పలవించె.

భరతుఁడు లేడిపిల్లం గానక పరితపించుట.

మ. అకటా ! నాచిటిపాప ! న న్విడిచి నీ వడ్డింతలే కేగితే
మెకమాటంబును బాసితే యడవి నేమోసంబును జెందితే
యెకలోయం బడి దారి తప్పితే మెకం బున్నట్టిచో టంటితే
సెకలోఁ జొచ్చితే పచ్చిక ల్మెసవుచున్ జెర్లాడుచు న్నిల్చితే. 36

మ. తగ నీరానెడునప్డు బొబ్బమెక మొద్దన్ బొబ్బరింపంగ లో
వెగడుం జెంది గడింది నై నెగిఱి ని న్వే నీటిలో నూడ్చియుం

దెగటాతెం దరిగట్టుమీఁదఁ బడుట న్నీతల్లి తా నక్కటా
తెగి నీపాటులఁ జూడ దయ్యో నది నాదే బాధ యయ్యోం గదే. 37
శా. నీటన్ బడ్డపుఁ డీవు చచ్చితివ యేని న్నేవుగా నాకు నీ
పాటుల్ క న్నొకయింతమూసికొని నేఁ బ్రాల్మాలి య ప్డుంటినే
నేటఁ వాలుగఁ బోయి తోపవు గదా యింతేని లో జాలి తే
కోటం చుంటిన యేనిఁ జేకొనుచు ని న్నోమం గదా బొట్టెరో. 38
క. వదవదలాడెడుమే న
య్యాదనునఁ బుట్టమునఁ దుడిచి యఱకడఁ గొని నేఁ
బదిలముగ నిన్ను సాఁకుచు
గొదలంటక యరయుచుంట గోడయ్యె సయో. 39
ఉ. కన్నులు ముక్కుమూసికొని కా ల్గదలింపక నేమ మంది నే
నున్నెడఁ జిన్నికొమ్ముకొన నొయ్యనఁ గోఁకుచు మేను నాఁకుచుం
గన్నులు మోము మూర్కొనుచుఁ గాళ్ళపయిం దల వెట్టి పండుచున్
న న్నెపు డంటి యుండునిను నాతరమే పెడఁబాసి యుండుటల్. 40
ఉ. తీరిచి రేక కాటుకను దిద్దినముద్దియకన్నుఁదోయికిన్
మేరకు మీఱుపోల్కెఁ గొని మించి తలిర్చెడు నీదుకన్గవన్
సారెకు వెన్కకాలిగొరిజం దగ గోఁకెడునేర్పు పెంపునన్
సొరును నెమ్మదిం దలఁపఁ జాల దిగుల్గొని కుంద కుందునే. 41
వ. అనుచు నక్కజం బగువిరాళి నెక్కొన నక్కలిపడి తుద కంబేదయై
మిగుల వగలం బొగులుచు మఱియును. 42
సీ. అలికి ముగ్గులు వెట్టునల వేల్పుటరుఁగుపై
నెలమిఁ బన్నుండువా రెవ్వ రింక
నగ్గుల వేల్వంగ నమరించుతెల్లులే
యిగురులు గొరుకువా రెవ్వ రింక
సొములఁ బూజింప సంతరించినపూల
నెసఁగి మూర్కొనెడువా రెవ్వ రింక

జేజేల దానంబు సేయింపఁ దెచ్చిన
యొంపునీ రానువా రెవ్వ రింక
తే. నేలికకు నారగింపు సేయింపక మును
బువ్వ బుక్కేఁడు మెక్కువా రెవ్వ రింక
నెపుడు నను ముద్దుగుడుపువా రెవ్వ రింక
నీవు విడనాడి పోయినయింతలోన. 43

ఉ. ఎక్కడ నుంటె నానినువ ! యిక్కడ నాపని యేమి చేసి నీ
వెక్కడి కేగితీవె మఱి యేమిగొందంబడి వేగుచుంటివే
పక్కనఁ బోయి కోలుపులివాచవి యైతివె నవ్వుటాలకీ
చక్కన దాఁగియుండి కొనసాఁగితె లోఁగితె యేమి యైతివే. 44

తె. తల్లిదండ్రులు లేనట్టిపిల్ల యనుచుఁ
మిగులనక్కటికం బెదఁ దగులఁ దగిలి
నడిచి మెకములదాడినిఁ బడఁగ నీక
పెంచునను విడనాడితే పెరిమ లేక. 45

తె. నాదుపెంపుడుకూన ! న న్గా దటంచు
జెదరి పోయితె నే నేమి చేయువాఁడ
నెటులు గనుగొందు వెండి ని న్నెటులు వాసి
యొడలియుసురులు విడక యోర్తుందు వాఁడ. 46

వ. అని పలుదెఱంగులఁ బలవించుచు నతం డుల్లంబున మిగుల నారా
టంబు జెంది నేను దబమున నున్న యెడ నన్నుఁ గొమ్ముల గోఁకు
చుండునట్టిగొనంబు లే నెన్నఁడు గందునో ? నే నించుక కసరినం గని
కొమరుండు బలె నెడఁ జని నిలిచి పిలిచిన మఱియు వచ్చి వెనుక నిలిచి
యుండునట్టిమెలఁకువలు గలదాని నెప్పుడు చూతునో? యది యెప్పుడు
వచ్చి నన్ను సంతసపఱచునో ? లేడి త్రొక్కినసేల జన్నంబుల కగు
ననుటం జేసి యీతోట నెంతపున్నెముం చేసికొన్నవో? జాబిల్లి యట్లు

నేను నీతల్లిలేనిపిల్లం బెనిచినం బున్నం బని చేకొంటి నట్టినే ని ట్టియి క్కట్టులంబొంద వలసె నక్కటా! దయ్యా చూ! యని దానిపైం గలతమ కంబునం జాల విరాళింపూలుచుం దనతబంబంతయుం జెడ జడనువడి యుండె నంత నొక్కింతసేపున కాజింకబుడుత చనుదెంచి గాచతబిసి కన్నుంగవకుం బొడకట్టుటయు నతండు పోయినసొమ్ము వెండియుం జేకొన్నవానిం బలె మిగుల సంతసించుచు దానిం జేర నరిగి మోరం బట్టి ముద్దుపెట్టుకొనుచు మేనెల్ల నిమురుచు సిరంబు మూరుకొనుచు నందిటం జేర్చుకొని యి ట్లనియె. 47

భరతుండు లేడిపిల్లను గాంచి సంతసించుట.

మ. అకటా ! నా చిటిపాప ! న న్విడిచి నీ వట్టాడు చెచ్చోటికిన్
మొకమోటంబును బాసిపోయితివో యీప్రొద్దింతసే పీవు నా
దుకనుందోయికిం గానరామి నును పెంతో తల్లడం బంది మే
నికిం గాకుండగం బోవునట్టిదగుచు న్వేంగించెం జూ మ్మా ననున్. 48

మ. జలకం బాడంగ లేదు సంజయును బెల్చ న్వార్వగా లేదు రే
ఫులు మాపు ల్దగ వేల్వ లేదు కరివేల్పు న్గొల్వంగా లేదు నీ
ఖులును న్దార్పంగ లేదు నిద్దు రది యెట్లో చూడంగా లే దయో
యొలకూనా ! నను వీడ నాడి యెటనో యా వున్న యీయింతలో౯.

ఆ. కంటం బడినవారిం గంటిరే నాబిడ్డ
ననుచు నడిగి యడిగి యడవు లెల్లం
దిరిగి తిరిగి యెందు నరయ నోపక పెల్లు
తల్లడిల్ల నైతి తల్లికాన. 50

క. నినుం గాననట్టిబెంగం, గొని యుల్లము తల్లడిల్ల గుండెలు పడకై
ఘనుజాయి దాపినట్టులు, కనవచ్చెన్ నాదులోనికడు పోబిడ్డా. 51

ఆ. కంటం బడితి నాదుకడ తేఅంగా నున్న
యుసురు కుదుటం బడియె మిసిమిం గంటి

మంటి పసిఁడికోఁడె యింటఁ జేరినయట్లు
లోఁ దలంచుచుంటి నాదుసూన. 52

వ. అని మిగుల వగలం బొగలుచుఁ దానంబును సంజయును దబంబును లోనగునన్నియును విడిచి దానితోడం గూడిమాడి యుండెనని శుకుండు వెండియును. 53

మ. తగులంబుల్ బెడబాపుఁ బున్నె మనుచున్ దా నాతఁ డల్లప్డు బం
దుగుల న్నెయ్యుర నిల్లు వాకిళులునుం దోరంపురాలచ్చియున్
దగునేల న్విడనాడి బోడి యగుచుక్ ఱాల్ అప్పలుం జెట్లు చే
మగముల్ గల్గినకాన మెట్టుచుఁ గటా! మా నీగెఁ గన్గొంటివే. 54

మ. ఇలు నిల్లాలును బుత్తురుల్ జగమునం దెవ్వారికి న్వేండి బా
ముల నెత్తింపఁ బునాదు లంచు విడి యాబూతంబు బూతంబు నాఁ
దలఁప న్జేరి లేడిపిల్లచెలిమిం దా జీంద్రమం దెంతయో
గలఁగె న్వింటివె? బమ్మ్రవాలు తుదుపం గాఁ జాలునే యెవ్వఁడున్.

ఆ. ఎంతవారి కైన నేకిమీఁదులకు నైన
వెన్నదొంగ కైన వేల్పుఁదబిసి
కైన నొసలిఁవ్రాఁతె కన్న లే దన్న వో
నెఱుఁగ మానిసు లన నెంతవారు. 56

మ. ఏకిమీఁడా! విను మంత నల్లభరతుం డేం డెన్నియే నట్లు కా
నక వేగించుచు నొక్కనాఁడు తనకుం జావంగ నౌచోప్పు కొం
చక యేతెంచినజాడఁ గాంచి మదిలోఁ జాలంగ నారాట మొం
ది కడున్ జేరువ నున్నజింకబుదుతన్ దేఱ్వారఁగాఁ జూచుచుక్. 57

తే. ఓసి! నన్నుఁ గన్నబిడ్డ! ని న్బాసి పోక
వచ్చెఁ దలమీఁద జేనంత వఱలు మిత్తి
చావు నిక్కంబు కటకటా! చేవ లేని
యీ విఁ కెట్టులు బ్రదికెదవే తలంప. 58

భరతుఁడు లేడికడుపునం బుట్టి విచారించుట.

మ. అని దానిం దలపోసి పోసి మదిలో నారాటముం బెచ్చు వి
చ్చినకన్నుంగవ నిట్టిఁ జూచికొనుచున్ జీకాకునుం జెంది చి
క్కనగాఁ గుత్తుకలోనఁ గట్టె మొలఁగం గా గుట్టు రెట్టింపఁ జ
ల్లని యొంటూర్పున నుండి కొంతవడి కెల్లం జెందె బెన్నిద్దురన్. 59

ఉ. కండెను గాజు వాతెను మొగంబు కనుంగవ కంగులో యనం
గ్రిందికిఁ బోయె బావవలెఁ గ్రిఁగడు పయ్యెను మూయ రాక నోర్
కండక మృల్లు కానఁ బడెఁ గాళ్ళును చేతులుఁ గొయ్య లయ్యె మే
నందుగుప్రమాఁకు నా బిగిసె నాతనిలో నుసు రేగినంతటన్. 60

క. ఆరాచతబిసిపీనుఁగు, నారయ బీతెలుఁగనట్టిఁడైన వపంకుఁ
గోరికఁ గని తనలోనం, జేరుచుకో నంటరానిజేజే కగునో. 61

వ. ఇట్లు పీనుం గై యతండు పడియుండినంత. 62

చ. ఉసురొదలి న్వడిన్ విడిచి యుప్పరపీదికిఁ బోవునప్పు డా
నిసువును నెమ్మది న్నిలిపి నెయ్యము పెంపున నుండెఁ గాన న
ప్పస చెడియున్న జేఁడు కడుఁబాటులపాలయి పోవ వెండియుం
గసవును మెక్క నిట్టి యయి కస్తికిఁ బుట్టెను దొంటి తెల్వితోఁ. 63

చ. కడుపున నున్న యప్డు తనకాళ్లను జేతులు మే స్గదల్ప రా
కడగొనఁ బ్రేవులుం బొరలు నంతటఁ జుట్టుకొనంగ కుళ్ళుపిట్టులోఁ
బడి కడు నెమ్మ లొత్త వెతపాలయి యుట్టినిసుంగు తెల్వి మైఁ
గడువడి బమ్మరిల్లెఁ దనకర్జముచేఁతకుఁ దల్లడిల్లుచున్. 64

తే. తల్లికడుపున నున్నప్డు దారసిల్లు
వారి కాబొజ్జలోనుండి కారు మనుచు
నేడ్చునట్లును గటకటా యెంతవంత
యనెమనట్లును విసవచ్చు నచ్చెరువుగ. 65

చ. వెనుకటిబాములందుఁ గటివేల్పును గొల్చినవాఁడు గాన నం
దున నపు డిట్టియై పాడమి తోరపుఁదెల్విని బాపుకుండి లో

ననయము నట్టిబాము తన కప్పుడు కల్గుట కెంతయేనియున్
గనలుచుఁ బిమ్మటం బడుచుఁ గాఱియ నొందుచు నేడ్చుచుండెఁబో.

ఆ. తల్లి పాలుగుడుపఁ దారసించిన ముట్టె
పొదుగుచెంతఁ బెట్టి కొదుగుఁ గాని
కడుపు నిండఁ బాలు గుడువ నొల్లదు వెన్నుఁ
దలఁచు చోడలు మరచి నిలిచెఁ గాన. 67

మ. కడుపు ల్గట్టి కోలంబుసాములు గడున్ గారాబ మేపారఁ బెం
బొదలందు న్బొలమందు మెట్టుకొనుచున్ బోవంగ నాజింక పెం
పు దలిర్ప న్నడయాడ దంటి కసవు న్మూర్కొఁదు కార్కొన్న పెం
ద్దది కోలుంబులి కాంద్రు కాంద్రు మని రాఁదాఁబారిపో నెంచదున్.68

సీ. వడి మెట్ట దడు గెటఁ బడి చీమ చచ్చునో
యనుబీతునను బాలమండు నెపుడుఁ
గసవు మేయదు దాని కుసురుగల్గెడు నది
తలఁ ద్రెంప నెంత యేడ్చెడునొ యనుచుఁ
డెఱచి నీ రాన దేచిఱుచేప నోటిలోఁ
బడి నల్గునో యని వెడఁదవగను
జేలదరికిఁ బోదు రాలి యెన్నులగింజ
లలకాపరికిఁ జెడు గగు నటంచుఁ

తే. దనదుకతమున నేఱి కెత్తఱిని గొదలు
కలుఁగకుండఁగ నెండుటాఁకులును నెండు
గడ్డియను మేసి యిన్నినీ ళ్ళడ్డి త్రావి
బ్రదుకు నేవగించుచుఁ వనబాముస కది. 69

సీ. తెఱనోటిమెకముల కిఱ వైనబలునీర
ముల కేగు నొకమాటు తలఁకు మాని
తనవారితోఁ గొండకోన కేగి తిరుగుచు
నుంకించి పడు క్రింద కొక్కమాఱు

పెనుదారి దారసించినవాఁకనడుమ నీఁ
దక యుండు నొకసారి తల ములుఁగఁగ
నడవి నల్లడల నేర్చెదుకార్చుచిచ్చులో
నొగిఁ జొచ్చి పొరలాడు నొక్కతేప
తే. తీఁగ కుత్తుక కుటి గాఁగ నూఁగులాడు
నొక్కపరి పసరంబుమే నూడి పోవ
జింక యగునట్టిభరతుఁ డేవంకనైనఁ
జేటు వచ్చునె కుడు పెల్లఁ జెల్లకుండ. 70
క. ఇప్పగిదిఁ గొన్ని యేడులు,ముప్పిటిఁగొన్నట్టివంత ములుఁగుచుఁదొలిబా
మప్పటితెలివిని నొకనాఁ,డొప్పుగఁ దనబాముగురిచి యుల్లమునందున్.
వ. మిగుల వగలం బొగలుచు నిట్లని పలవింపం దొడంగె. 72
మ. దొర తెల్లక్ దొర వంచు మెచ్చుకొనఁ గాఁ దొరంపులచ్చిన్ జగం
బరయ న్వేల్పులతేనితోడఁ బురుఁడై య ప్డుండి పెన్నేలకుక్
దొరలం జేసి కొమాళ్ళనుం దబుసు లేత్రోవం దగం జేరి రా
నిర వత్తోటగ నుండి రాతబిసినై యి ట్లైతిఁ గా దయ్యమా. 73
క. జింకం బెంచినకతమున, గొంకక నాతబము నేటఁ గొట్టుకొనిచనెన్
బొంకక సెడి యిటు లైతిన,యింకిట నే నేమి యగుదు నెఱుగం గట్టా.
ఉ. ఏటికి నేటికి న్మనుఁగ నేగితి నేటికి నీట నుంటి నే
నేటికి లేటిపిల్లఁ గని యింపునఁ బట్టితిఁ బుట్టె నంచు న
ప్డేటికిఁ బెంచినాఁడ మఱి యేటికి మాటికిఁ బ్రేముడింతు నిం
కేటికి నెవ్వగం బొగల నేదియుఁ దప్ప ద దెట్టిమేటికిన్. 75
వ. అని మఱియు నా కాలేడిపిల్లకతన నిట్టిబా మెత్తి బాములం బడఁ
గల్గె విడుపుపేరితానకంబు దూరం బయ్యెఁ గదా! యని యంగ
లార్చుచు నొక్కనాఁడు తన్నుఁ గన్నతల్లిం బాసి యొకఁడ తొల్లింటి
పులపలున కిల్లగునల్లతోఁటకుం బోయి యం దామే నూడిపోవ

నుపము నెమకుచుఁ బున్నెమిచ్చు నచ్చం బగువాయేటినీటఁ గ్రుంకు
లిడుచు నిచ్చలుం బాడిచెడిఁబ్రొద్దున శెట్టియెదుట సాఁగిలఁ బడి
మ్రొక్కుచు వాలుఁబండ్లు కొమ్ములకొనలం గ్రుచ్చి తెచ్చి జడదా
రులకడఁ బెట్టి కొలుచుచుఁ గొమ్ముకొనల వారిమేనికండూతిం
బాపుచు నుల్లంబున నెల్లవేల్పులకును మ్రొక్కు లిడికొనుచుఁ గడు
నేమంబున నుండె నంత. 76

లేళ్ళ కుమ్ములాట.

చ. అడవుల వేటకాఁ డొకరుఁ డల్లికఁ బెంపుడుజింక కొమ్ములన్
వెడఁ దగిలించి వెంటఁ గొని వేటకు మెట్టుచు నిట్టు నట్టుచున్
జడనుపడ న్నడల్ దిరుగ సాఁగెడు నాభరతుండు సాఁగఁ బో
ల్చెడుచిరుజింకఁ జూచి తనజింకను బోనుసి కొల్పఁ గొల్పెరన్. 77

చ. అదియును గొమ్ములం గలుగునల్లికతో బడి నేగుదెంచి మో
మది యొకయోరఁ జేసికొని యక్కడ నేలనుఁ గాళ్ళ దువ్వుచున్
గొదుగక ముట్టె ముట్టెయునుఁ గొల్పుచుఁ గొమ్ములఁ గ్రుమ్ములాడి య
య్యదనున గొం తుగిం బడఁగ నచ్చిలుజింకనుఁ లాఁగె నీడ్చుచున్. 78

మ. పొగరుం జెందినవేటయిట్టి తనకొమ్ముంజిక్కముం గుత్తుకన్
దగులం బెన్వడి నీడ్చుచుండెడుతఱిం దబ్బిబ్బునుం జెంది యా
బిగువుం దప్పినవెట్టియిట్టి పుడమి న్బిరంబునుం జేవ లే
క గుభుల్లంచును సద్దుగాఁ బడియె మే ల్లత్తెం గదా యం చొగిన్. 79

మ. పడి దయ్యంబుఁ దలంచుచున్ దనకు మే న్వాయంగ నానజ్జువ
చ్చెడు నంచుం గడుసంతసించుచు మదిం జేడ్పాటు లేఁడా బళీ
కడగం డ్లింకిటఁ దీఱె నేను విడుపుం గంటు న్నరే మేలు మే
లడియాస ల్దగఁ బండఁ జేసె నిట నాహా! వెన్నుఁ డం చున్నచోన్. 80

ఉ. బట్టను చప్పుడు ల్వొవడమ బొంకులజోకగ నున్నజాలపై
జిట్టును బుస్సు మంచుఁ గడఁ జేవమొయిం గొని గండుకొన్నయా

యిట్టె వడి న్వడి స్గడిమి నీడ్చుచుఁ బోవుడు మేనినెత్తురుల్
జట్టని కాళ్ళు జారి పడులాగునఁ గాలువ గట్టె నయ్యెడన్. 81

ఆ. తోలుత మేనితోలు తుకతుకత్రై పోయెఁ
గారె నల్ల కండకండలుగను
బుడమి నెమ్ములెల్లఁ బొడిపొడిమ్రై రాలె
నిట్టె నిట్టె యూడ్చు చేగుతఱెని. 82

క. ఆయంగలార్చునంబడి, పాయక యున్నట్టిజింక పలు తెఱగుల నా
నాయది యంతయు మే లని, యే యుండెను గాని వగవ దంతేని మదిన్

తే. ఇంచు కాత్రము పడినపై నెంతయేని
సుకము గలిగెదుననుమాట చొప్పు దెలసి
యెఱుకఁ గలిగినజింక లో నేల వగచు
మగనితో నగ్గిఁ బడుసతి వగచికోనునె. 84

వ. అట్లు చియ్యఁబట్టి కావరంబున నున్న గండుటిట్టె యూడ్చుకొని పోవం
బోవ ముంగఱ గండకియేఱు దారిఁ దారసించినం గని యాజింక తేఁ
డాయేఱు పున్నె మిచ్చుం దాన ముఱితి గందు నని గిజగిజం గింజు
కొని తన్నుకొనుచుం బెనుఁగులాఁడి నీటం బడి కొట్టుకొనుచు నసు
వులం బాసె నప్పు డావేఁటకాఁ డరుగుదెంచి యుచ్చు విచ్చి నేలంబడి
పొరలాడుటం బాడుపడ ట్రై పనికిమాలినయాబొందె నందునన విడ
నాడి యెటయేనియుం బోయె ననినఁ బుడమితేఁడు దబిసిఱేనిం జూచి
యి ట్లనియె. 85

మ. జడదారీ! భరతుండు జింకయొఁపలిం జాలించి తర్వాత న
వ్విడుపుం బేరిటితాన మందెనో కడు న్వెన్నాణముం బాపుని
ప్పుడమి న్వెండియుఁ బుట్టెనో తెలుపుమీ పోలించి నే నాలకిం
చెడు నిచ్చం దగి యుంటి నాఁగ ననియెం జెన్నారఁగా నాతఁడున్.

క. పుడమిదొరా! మెకపుటొడల్
విడనాడి యతండు ముగిలి వెలుఁగక మఱియున్

బుడమిఁ బొటుకోలంబునఁ
బడి కడుఁ బడరానిపాట్లు పడియె న్నిపుమా.

ఆంగిరసుఁడను బ్రాహ్మణుని వృత్తాంతము.

తే. మున్ను కలఁ డాంగిరసుఁ డనుపుడమివేల్పు
వేల్పులను జన్నముల మెక్కఁ బెట్టినట్టి
మేటి సోమాసి తగఁ దొలిమున్కగముల
నరసి తబ మొనరించెడునట్టివాఁడు.

సీ. నడిరేయి యగుదాక విడువక చట్టుల
వల్లె వేయించి ప్రాఁబలుకు వెల్ల
వెన్నునిఁ దలపోసి వెడనిద్దురం జేసి
వేఁకువజామున వేగ లేచి
పదివేసములసామి మదిలోనఁ దలఁచి యు
త్తఱిఁ గర్జములు దీర్చి తగినమాడ్కి
నిసుఁగులతోఁ గూడి నెఱిమీఱి నేటికిన్
జని యందు నీరాడి సందె వార్చి

తే. తొలిమినుకుతల్లి నెదలోనఁ దలఁచి తలఁచి
వెన్నువలకన్ను నేటికోళ్ళెన్ని చేసి
యింటి కరుదెంచి యగ్గుల నెఱిగి వేల్చి
యాంగిరసుఁ డిట్లు నిచ్చ లెసంగుచుండు.

క. అచ్చంపుగోనంబులచే, నిచ్చలు బజ లెల్ల మెచ్చ నెమ్మి మెఁ
జచ్చుపడనతఁడు మెలఁగెడు, నిచ్చలవిడిఁ దిరుఁగ మదిఁ విడువక కడి

తే. అతని కిద్దఱు పెండ్లము లందుఁ బెద్ద
గరితయందును దొమ్మండ్రుఁ బరఁగుఁగొడుకు
కుఱ్ఱలును జిన్నసకియందుఁ గూఁతు నొకతెఁ
గాంచి పుడమిఁ గాపుర మొనరించు నతఁడు.

వ. ఇట్లాజన్నిగట్టు కాపురంబు సేయుచున్న యప్పుడు. 92

మ. బరువై త్రోఁచినజింకమేను విడి బాపం జైనతర్వాతనే
పరికింపం గడతేఱు బాము లనుచుం బాటించి లో నెంచి యా
భరతుం డంతటఁ బున్నియంపుగనియై బాగొందుచున్నట్టియాం
గిరసుం గూడినచిన్న చేడెకడు పన్ కేల్పట్టెలోఁ జెరెఁ గా. 93

చ. కడుపున నున్న యప్డు తనకల్గినబాములఁ గూర్చి యెంతయే
నడలుచు దేవరా! యనుచు నాత్రముఁ జెందుచుఁ దొల్లి తా నొగిన్
వెడఁ గయి చేసినట్టి పదివేలకు మించిన చెడ్డచేఁతలం
దడవుచుఁ దిట్టుకొంచుఁ దనుఁ దా నిసి యం చతఁ డుండె నయ్యెడన్.

ఆ. జడనుపడినబుద్ధి గలిగినకొమరుండు
కడుపులోనఁ జొచ్చి కడఁగుఁ గాన
నంచనడలచెలియ కాతటి నెంతయు
నడలు జడనువడియె నాఁడునాఁట. 95

క. తెలివి యనుదివ్వెతేజున, వెలుగొందెడుకొడుకు లోన వెలసినకతనన్
నెలఁతకు నొడ లయ్యెడలం, దళదళ మనుజోతి నలరెఁ దగఁబరికింపన్.

క. సిడుపడు జాబిలిఁబట్టి, న్నెడలెడునో యనెడువెడఁద వెఱపునఁ బోలెన్
గడుకొనియారేర్పడున, ప్పుడు వెలవెలఁబాఱెమోముపొలఁతికిమిగులన్.

తే. వెలఁదిమిన్న పాలిండ్లకుఁ బిరుదులకును
నడుమ నుండి లే దన నొప్పు నడుము మిగులఁ
బ్రబలెఁ గలవారినిర్వురఁ బట్టి నెనరు
వడసి చనుబీద జగమునఁ బ్రబలు టరుదె. 98

మ. కలదో లేదో యటన్న సందియమునన్ గన్పట్టు లేఁగౌను మి
క్కిలియై త్రోఁచెను జన్మొనల్ గఱిజిగిం గేరు న్నడ ల్వెన్నవై
యలరె న్మోమది వెల్లనయ్యె మెఱుఁగై యా రొప్పె మ న్మెక్కుటల్
గలిగె న్నాటికి నూర్పు లగ్గలముతై కాన్పించె నప్డింతికిన్. 99

ఆ. లేవఁ గూరుచున్న లేవనీనట్టులు
పెరుగు చున్నయట్టిపెద్దకడుపు
చెలఁగ మోసి మోసి నెలలు తొమ్మిది గాఁగఁ
గనియెఁ గొడుకుకుఱ్ఱఁ గలికిమిన్న. 100

బ్రాహ్మణ జన్మము.

చ. నెఱి లగనంబునం బొషమి నిద్దఁపుజోతిని వెల్గుచున్నయ
చ్చిఱుతను మంత్రసాని తనచేసురియం దగ బొడ్డు గోసి పో
గరితలు లాల వోసి వెనుకం బొడితోఁ బొగ వేసి యుయ్యెలన్
బఱచిన మెత్తల న్నిలిపి పాటలు దీటుగఁ బాడి రూఁచుచున్. 101

చ. పురికొని జుమ్మురంచు నొకపు ర్వది యెన్నెమ వచ్చి చెక్కిళుల్
కరకఱి నొక్కి చంపికొనుఁ గందు నటంచు వెర న్మఱి న్మఱిన్
బఱపుచు నల్గుచెట్టుకత బాపనికూఁతురు మాలపెండ్లమం
చరగడె కర్వదాఱుపరు లాడుచు నుండ్రు నెలంత లత్తఱిన్. 102

ఆ. గాలి దూలి సోకి కందు సెడక యుండఁ
జల్లి బూదె వేళ్ళు వెల్లకులును
నూఱి పొగలు వేసి నోములు నోపించి
పురిటినాళ్ళు పదియుఁ బోకడంచి. 103

క. మఱిబారసాల నొనరిచి, భరతుం డని పేరుపెట్టి బంగరుపున నాం
గిరసుండు పాలు పెదవులఁ,బరఁగం దగులించెఁ దానుబఁడతుకతోడన్.

వ. మఱియునుం గలపండువులెల్లఁ గావించుచుఁ దల్లిదండ్రులు దమబందు
గులపిండుతో మొంచుకొనుసంతసంబున నిండుకొని యుండి రంత.105

శా. కన్ను ల్విచ్చి కనందు గిల్లు లిడినం గార్కార్మనం డుగ్గునుం
జన్నుంబా లిడఁ బోవ నావనఁ దొగి న్గాల్సేతు లాడింపఁ దే
సన్న లూసపిన నవ్వఁ డెప్పుడును ఆచందంబునం బందు లో
వెన్నుం జూచుచు నుండెఁ గానఁ గడు తెల్విం బుట్టినప్పటియున్.106

చ. నిసువును గాలి సోకె నని నేర్పునఁ జేతుల రచ్చఁ గట్టియున్
బసుపును మేనఁ జల్లియును మందులు ప్రాఁకులు నూటి పోసియున్
విసువక చేయరానియవి వేలను జేసియుఁ దల్లిదండ్రు ల
ద్దెస వితయైనవారయిరి దేవరచెయ్యువల కబ్ర ముందునే. 107

వ. ఇట్లుండియు నబ్బుడుతం డెట్లో యొక్కచందంబునం బెఱిఁగి పెద్దవాఁడై.

బా ల్య వ ర్ణ న ము.

సీ. విద్దెంబు లొనరించుఁ బ్రొద్దుకంటిని నిల్చి
కొలుచుట లనుచును దలఁచుకొనుచు
దప్పటడుగులు వేయుఁ దరిగట్టువారికి
వలఁగొనుటలు నాకుఁ గలిగె ననుచు
నత్త తాత యటంచు నాడు నల్లనివేల్పుఁ
గైవార మొనరించుకరణి యనుచు
బొమ్మలఁ గొనియాడుఁ గమ్మవిల్తునితండ్రి
కగురూపు లన్ని చేఁ దగిలె ననుచు

తే. అతని నెప్పుడుఁ దలఁచుచు నతనియందె
తనదునెమ్మది యంతయుఁ దగులుకొలిపి
తెలివి గలుగుటఁ దొంటిబాములను దెలిసి
బీతుఁ గొను బత్తుఁ డగుఁ గానఁ బెరిమ నతఁడు. 109

క. తల్లీ! యని దండ్రీ! యని, తెల్లముగాఁ బిలుచు వారిఁ దేలింపంగా
నుల్లంబున జగములకని,యల్లనఁ దొలిదొల్తననుచు నాభరతుఁడొగిన్.

ఆ. సంగడీండ్లు చిఱుత లంగడి నాటల
నాడఁ బిలువ నాతఁ డాడ నిలక
నక్కటకట వీర లడుగునఁ బురుపుల
నలఁగఁ దొక్కుదు గని తొలఁగి పోవు. 111

ఆ. ఓనమాలు తండ్రి యొయ్యన వ్రాయింప
నొజ్జకడను జదువ నంప నతఁడు

జడనువడినవానిచందంబుఁ దోఁపఁగఁ
జదువఁ డన్ని తొల్లి జతన మగుట. 112

వ. మఱియు నిట్లు పిచ్చియుఁ జెవుడును మూఁగయుం గ్రుడ్డియుం గలిగి జడనువడినవానిమాదిరిం జూపుచు జడభరతుం డనియెడు పిరుదు పేరుం గాంచి కించుసంచునఁబెద్దమొద్దు మొఱడు తెఱంగున నున్నను గన్నవాఁడు గాన నాంగిరసుండు ప్రేముడిం బెంచుచు జన్నిగట్టులకుం జేయనగునట్టిచేఁత లన్నియు వరుసతోడ నడపించి వడుగుం జేసి నడవడికలనేర్పు గదుర విద్దెలం గఱపుచువచ్చిన నిచ్చలే కుండియుం దండ్రియానతి నన్నియుం గఱచి కైకొని యతండు విను నట్లు తల తోడం గూడినతొలిమినుకులతల్లి నేమంబున నుడువుచుఁ దొల్లి వచ్చినవాఁడైన మఱియుఁ దొల్లింటిపలుకుల వల్లెవేయుచు నగ్గుల వేల్చుచు వేల్పులం గొల్చుచుఁ దల్లిదండ్రుల సంతసవెల్లిం దేల్చుచుండె ననిన విని తరువాత కత చెప్పు మని జడదారులు సూతు నడుగుటయును. 113

ఆశ్వాసాంతము.

మ. ఎటఁ జూడం దనపేరు తేజు నసమే యింపొందున ట్లెంచి య
క్కటికం బేర్పడఁ బేదలన్ మనుచుచుం గావించుచుం గోర్కు లెం
తటికైనం దగి నేల నేలఁ గడుజాణం డైనమారావువేం
కటసూర్యుండు పిఠాపురంబుదొర వేడ్కం దేలి మే లందుతన్. 114

గ ద్య ము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన బ్రహ్మానంద మను
నచ్చతెలుఁగు ప్రబంధంబున
ద్వితీయాశ్వాసము

---

# బ్రహ్మానందము

## తృతీయాశ్వాసము.



క. సిరి గలరావుకొలంబున, గరగరికం బొడమిపుడమికలికికి దొరయై
పరఁగుకుమారమహీపతి,కరమరు దగుపేర్మితో జగంబునఁ దనరున్. 1

వ. ఆలకింపు మవ్వలికత శుకుండు పరీక్షితునకుం జెప్పినట్లు సూతుండు జడదారుల కిట్లని చెప్పం దొడంగె. 2

మ. వెడఁ గయ్యె న్వడు గైనపిమ్మటఁ గడున్ విన్నాణ మావిద్దెలున్
నడవళ్లుం దగ నేర్చి యట్లు తమకుం గాటంబుగా సంతసం
బడరింపం దలిదండ్రు లక్కొడుకునం దల్లప్డు చాలంగఁ బ్రే
ముడి బెట్టింపఁగ నుండి రింటిపను లాముంబుత్తురు దీర్పఁగన్. 3

ఆ. ఇటులు కొన్నినాళ్లు లెసక మెసఁగ నాంగి
రసుఁడు నతనినకియు నసము మీఱఁ
గన్నకొడుకు లూడిగము సేయ నుండియు
నునికిఁ బాసి చనిరి యొక్కనాఁడు. 4

భరతుఁడు విరాగియై యింటిపనులను తీర్చుట.

వ. ఇట్లు కన్నవా రడవుల కరిఁగినవెనుక నిల్లు చక్కఁ బెట్టుకొనుచున్న సవతితల్లికొడుకు లెల్లరు నీసున నాభరతుని విద్దెలం జదువ నీయక యింటిపనులయందు నిలుపుటయు నతఁ డెప్పటిం యట్ల వెంబరవిత్తు వలె నై మెలంగుచుఁ దమవారు చెప్పినవియెల్ల నేమరక చేయుచు నిలుఁ దీర్చుచుండె నప్పుడు. 5

సీ. వేఁగునప్పుడు లేచి బాగుగ నిల్లు వాఁ
కిళ్లు వీదులు నూడ్చి నీళ్ళు చల్లి

యరుఁగులు గుమ్మము లఱులు నుద్దికిఁ బెండ
నలికి ముగ్గులు పెట్టి పొలుపు మీఱ
బోలెలు చెంబలు ముంతలు వెలిచియు
నిల్లువట్టినపాచినీళ్ళు మోసి
మడిదోవతు లుదికి పడినన్ని మడినీళ్లు
వడసి యెల్లరకును వంటఁ జేసి
తే. వెనుక నెంగిళు లెత్తి బల్పేడఁ జేసి
వడ్లు దంచి పిండి విసిరి పప్పు చేసి
సంజదివ్వెలపనిఁ దీర్చి సరగ వండి
యాడపనులు చేయు గెడప కతఁడు గడఁగి. 6
సీ. దూడుకులపా ల్పిండి తోడి మేపుకొని వచ్చి
పుల్లెలు గుట్టి గొడ్డళ్ల వంట
కట్టెలు గొట్టి నాగలి దున్ని గుద్దలిఁ
ద్రవ్వి పొలము దొడ్డిఁ దనరఁ జేసి
కూరగాయలచెట్లు గొలిపి గనిమ లెల్ల
మునుఁగ నీటను జేతిమోట లాఁగి
చేలఁ గలుపుఁ దీసి నాలుగుపెడలను
వెలుఁగు చక్కఁగఁ బెట్టి పిట్ట గాఁచి
తే. తను బవలు రేయి గడి యేని గునుక కిల్లు
పొలము నరసి కాపాడుచు మొనసి యున్న
పనులు నన్నలయానతిఁ బాటుపడుచు
సలుపు నిచ్చలు రిక్కసిచంద మమర. 7
వ. ఇట్లుతం డెడతెగక యింటిపనులయందు మెలంగుచుఁ చేతకాని రెండు కాళ్ళపసరంబు లగువారిచేఁ బిచ్చివాఁడు వెట్టివాఁడు గ్రుడ్డివాఁడు జడ్డివాఁడు నని పిలువం బడుచు నందులకుం దగినపలుకులం బలు

కుచు మంచిచెడ్డ లగుతినుబడుల నాలికకు సరిచవులఁ దలంచి మెస
వుచు నెందున నించుక ప్రేముడి సేయక మెలంగుచు లోపల నెవ
తెగనిసంతసంబున వెలుపలి వన్నియుఁ బనికిమాలిని వని తెగడుచు
నేను నాయది యనునది చెందక యెండకు వాన కివమునకు నోడి
పైఁ జీర గప్పక గొప్పయెద్దుబలె బలిసియు మెత్తని గానిమేను గలిగి
నేలం బండి దుమ్మునం గప్పఁబడినమంచిమానికంబు పోలికం గను
బడనిబమ్మ తేజు గలవాఁడై మైలచింపి మొలం జుట్టి మసిపాత లగు
జన్నిదంబులఁ దాల్చి జడనుపడినవానివలె నుండి తమవారు పొలము
పనులయం దుంచిన నందు గీడుమేళ్ళు హెచ్చుకుందు లెఱుంగ
కుండి యుముక తవుడు తెలికపిండి పొట్టు నిప్పటి మాడు డబ్బెడ
లోనుగాఁ గలయవి జేజేలబువ్వపగిదిం దలంచి కుడుచుచు నిలిచి
యుండె నట్టియెడ. 8

చ. అడవిపొలంబునందుఁ దమయన్నలపంపున జొన్నచేను తా
నెడపక పిట్టఁ గాచి షవ లింటిపను ల్నెఱవేర్పఁ బోయి రే
నడి యగునప్డు వెండియుఁ గన న్మెయిఁ జింపియు లేక మోడులా
గడెరెడు మంచునందు సని నారయవచ్చుచు నుండు నిచ్చలున్. 9

వ. అప్పు డొకనాఁటిరేయి. 10

భరతుని దుష్టజంతువులు హింసింపఁ బోవుట.

మ. ఒకచో బెబ్బులి డాగియుండి వడిగా నొక్కంజమై వచ్చి వా
నికి వెన్కం జెయిపట్టి యీడ్చుకొనుచున్ రెం డంగ వేయంగఁ బో
యి కడుం గాలినయుక్కుతుండుబలెనై యింపొందుమైచేవ నా
గక కోటల్ వడి రాలఁ గూలఁబడి వెన్కం జచ్చెనో నాఁ దగెన్.11

తే. కట్టెలకు నేగ నడవిలోఁ గాఱుపెన్ను
వడిగఁ జనుదెంచి పడఁదొబ్బి యడుగున నొక
కాలు ద్రొక్కి తొండమునఁ బై కాలు వట్టి
యతనిఁ జీల్పఁ బోఁ దెగెఁ దొండ మడరుబలిమి. 12

ఆ. కాఱుదున్న తనదుకోరకొమ్ములఁ గానఁ
దిరుగువానిమేను దెఱలఁ బొడిచి
చెవులపిల్లి యనుచుఁ జెప్పంగ నగునట్లు
బోడి దయ్యె వాఁడి పోడుము లఱె. 13

ఆ. కారుకోన నొక్కకాఱుకెలుఁగు వానిఁ
గాంచి బొబొబో యంచుఁ గలియఁ బడఁగ
వచ్చి బమ్మతేజు చిచ్చు నాఁ దోఁపఁగ
వెఱచి పఱచె వెనుక వెనుక దారి. 14

క. త్రాఁ చొకఁడు వానిమీఁగా, లేచినపగఁ గఱచి కోఱలెల్లం దుల్లన్
వేచట్టు నడిన కై వడిఁ, దోఁచె న్దనలోనియుసురు తొలఁగినదానన్.

వ. ఇట్లు దయ్యంబుచెయ్వి పెంపున నేయడవిమెకంబులకున్ జడియక
తొల్లింటిజొన్నచేను రేఁబవలు విడువక కావలియుండునెడ నొక్క
నాఁడు. 16

భరతుని సత్తికి బలి యియ్యఁబోవుట.

ఆ. కలఁడు వీటియందు బలిజకొలంబున
కొడయఁ డటఁ బటేలు వడి గలాఁడు
సిరులఁ జాల జెంది చెలఁగువాఁ డెప్పుడు
పాడిపంటఁ గలిఁగి ప్రబలునొకఁడు. 17

ఉ. ప్రోలిపటే లతండుఁ గడుపోడిమిమై సిరు లంది యుండియుం
జాలఁగ బిడ్డలం బడయఁ జాలమి నావలవంత గుందుచున్
వేలుపు లడ్డుపెట్టి రట వేయగుచేతుల సత్తిఁ గొల్చినన్
మే లగు నంచు నూరికడ మించినకోవెల కొక్కరాతిరిఁ. 18

క. చని నేమంబున సత్తిం, గొనకొని పూజించి తనకుఁ గొడుకుల నిమ్మం
చని వేఁడిననెనాయమ,యనుబడసెదుమానిసిబొలియొసఁగుదు వేనిన్.

ఉ. ఆపలు కాలకించి మదియం దపు డెంతయు సంతసించి య
క్కాపుకొలంబువాఁడు తనకావలివారలఁ బిల్చి యెక్కడే

నోఁపికతోడుత న్నెమకి యొక్కనిఁ దోడ్కొని రం డొకింతలో
నే పరికించి మీరు, బాలి యిచ్చెద సత్తికి నేను వేఁడుకన్. 20

క. అని యాన వెట్ట వారలు
పనివిని యొకచోట నొక్కబలుమానిసినిం
గని కొనిపోయెడుతఱి న
య్యానదలఁ గికురించి పఱచె నాతఁడు కడిమిన్. 21

క. వా రారేఁజీఁకటిలోఁ, బాఱెడునాతనిని నెమకి పడయఁగ లే కా
సూరునిబీతునఁ దిరుగుచు, నారసి రొకచోటఁ బాలమునం దాభరతున్.

ఆ. అరసి పట్టి యతని నయ్యారె! యీబాప
నయ్య చియ్యఁ బట్టి యలరు వీనిఁ
జూచి సంతసించుఁ జూ మనయొడయండు
నోడలినల్ల సత్తికడుపు నిండు. 23

వ. అని కులుకుచుం దఱిమి తోడుకొని పోయి తమయేలికకుం బొడ
సూపిన నతం డింతింతనరానిసంతసంబునం బొందెనంత నతనిబంటు లతని
కిం దలయంటిపోసి పసపుపూసి క్రొత్తపుట్టంబులు గట్ట నిచ్చి మేన
గందం బలంది పూలదండలు మెడనిండ వైచి నగలు వెట్టి మంచి
బువ్వం బారగింపం బెట్టి తమలంబుఁ జేయించి మంచియగరుసంపగి
యత్తరుతావి గుబులుకొనం జేసి పెద్దవాయిదంబులతో నూరేగిం
చుచు దేవళంబునకుం దోడుకొని పోయి యెదుటం గూరుచుండం
బెట్టి రపు డక్కాఁపువాఁ డాముగమానిసినెత్తుట సత్తి నలరింపం
దలంచి మంతరంబులు చదువుచుఁ దనచేతికత్తిం దూసి జళిపించుచుం
దల ద్రెవ్వనేయ నుంకించె నంత. 24

భరతుఁడు తనలో సంతసించుట.

చ. తనతలఁ ద్రెవ్వఁ జేయు నని తా నపు డెంచియు నించుకేని బీ
తనునది యెట్టిదో యెఱుఁగ కాభరతుం డెద నంతసించుచున్

గనలక వారలం దనదుగారవపుంజెలు లట్టు లెంచుచుం
గనుఁగవ మూసికొంచు మదిఁ గన్గొనుచుండెఁ గడంక వెన్నునిన్. 25

వ. అంత నాకోఱలమ్మయు నెల్లయసులదాల్పులయందును వేరంబు లేక చెలిమిం జూపుచు బమ్మం గనునాపుడమివేల్పు తేజుఁ జూడ నరిదియైనం దనకెట్టుపోయి యెట్టు వచ్చునో యనుబీతున గడగడవడంకుచు నతని నెడఁజేసి మిగులనీసున హుమ్మనుచు నొక్కకేక వైచి చెడుగులై పాఱునిం జంపునానాలవజాతి వానిని వానివారినిం బిలువఁ జేరులే కుండ నట్లు జంపి తినుచు నాటలాడుచుండె నని వెండియు. 26

చ. ఒరులసిరుల్ చెడం గొనియు నొల్లకుఁ గీడొనరించుచుం గరం
బరయక బొంకులాడియును నాత్రముఁ జెందెడువారి దూఱియుం
గరకఱి యైనవాఁడు సిరి గాక తనంతన వేఁగి చచ్చెడున్
దొరఁ గొనివానివంగడమునుం జెడి మ్రగ్గెడు నిక్క మింతయున్. 27

క. ఒకరికి నెపు డెగ్గొనరింపక తనత్రోవం దనుజనువాఁ డేగొద లం
టకసిరులందులఁ దూగుచు, సుకముగనూఱేండ్లు బ్రతుకుసొంపుదలిర్పన్.

వ. ఇందుల కక్కాఁపుఱేఁడును భరతుండును దార్కాణం బని మఱియును.

ఉ. అత్తఱి నేలవేల్పు మదియం దట బీ తొకయింత లేక వే
కుత్తుకఁ గోయ వచ్చి తను గుంజెడువారలయందు సత్తియం
దొత్తెడుకత్తియందుఁ గడునొప్పెడు వెన్నునిరూపు నిల్పి లో
హత్తియ యుండుఁ గాని యిసుమంతయు నాత్రముఁ జెందఁ డయ్యరే.

వ. అంత నప్పాఱుండు గుడివెలువడి పోయి క్రమ్మఱం దొల్లింటిజొన్న చేను గాయుచునుండె నట్టియెడఁ గొన్నినాళులు గడచినవెనుక యొక్కనాఁ డొక్కపుడమిఱేఁడు కపిలునివలన నేను దానైతి నను తెలివి గలిఁగించుకొనునాసం బల్లకి యెక్కి యతనికడకుం బోవుచుండ మోఁతగాండ్రు తమయం దొక్కరుండు తెవులుగొంటై నడువఁ జాల కుంటం దెలిసి చేనికడ నున్నభరతునిం బట్టుకొని పోయి వీనిచే

మోయింత మని పట్టి మూపునం బల్లకిదండి వెట్టి తోలి నడపించి
రట్టె మెడ నతండును దన మోపినకోలంది మోయుచు నడుమ నప్పల్లకిం
దనకు మిగుల గుములుపు దగులుటం జేసి పుడమిఱేఁడును. 31

క. కుదుపున నటు నిటు కదలుచుఁ
దుద కందుం బోర్లఁ బడియుఁ దొడిబడి మఱియుం
బదిలముగ లేచి వెండియు
గుదుపున్ సైఁపంగ లేమిఁ గుతిలం బడుచున్. 32

వ. బోయలం జేరి యి ట్లనియె. 33

చ. ఉదుగుడి బెస్తలార నడ యుల్లమునం దళు కింతయేని లే
కడుగున మిఱ్ఱుపల్లముల నారయ కిట్టులు మీరు బిఱ్ఱుమై
నడచుట మేనికిం గుదుపు నాటెడు నెంతయు నిందు నిల్వఁగా
గడగడలాడుచుంటి నిటు కల్గుట కేమికతంబు చెప్పుఁడీ. 34

వ. అనుటయు నాబోయ లి ట్లని రయ్యా యియ్యది మావలన నైనది
కా దీనాలవవాఁడు మంచిగ మోయ నేరండు గావున మేమును నీత
నితోఁ బాటివారము కావలసి వచ్చె ననినం బుడమిఱేఁడు పెద్దలఁ
గొలిచినవాఁ డయ్యును నాగరికినుకం గనకనలాడుచు నెఱుకఁ దప్పిన
వాఁడై నీఱు గప్పిననిప్పువలె నెఱుంగ రానిబమ్మ తేజున నొప్పు నా
బాపనయ్యం గని కటకటంబడుచు మేలంబు గా ని ట్లనియె. 35

పశేలు భరతుని జెందనాడుట.

చ. ముదుసలివాఁడ వీవు కనుబొమ్మలవెంట్రుక లెల్లఁ బండె మై
వదవదలాడు చుండె నిటు పల్లకి మోయుట దప్పి తాఁకటన్
బొదలెద వెట్లు తాళుదువు పో నిను నిందులఁ బెట్టి మేము మో
యుదు మిఁక నిల్వు మీ యనుచు నొయ్యన మేలములాడఁజొచ్చినన్.

క. విని వినని యట్లు పాఱుఁడు
కనలక మాఱాడ కట్లు కనుమోడిచి తాఁ

దనదారి నడచుఁ బల్లకి
తనమూఁపున నొరసి మిగుల తబ్బిబ్బిడఁగన్. 37

వ. అంత నాబాపనరతనంబు తనకుం గడపటిది యగునాబామునందు నేను నాయది వీఁడు నావాఁడు వాఁడు నాసూఁడు ననునవి విడిచి యచ్చంపు తెలివి మెయి నా బమ్మం గనుచు మాటాడనినేమంబున నారాయనిపల్లకి మోయుచు నడచుచున్న వెనుకటివలెఁ గుదుపు గదురు టుడుగకునికిం జేసి యీసున నతండు వెండియు నిట్లనియె. 38

ఉ. చావఁగ మోదెదం బ్రదికి చచ్చినయట్టివెడంగుబోయ నీ
కావర మిట్టులుండినది గా తగు నాదగునాన మీఱి పో
నీ విటు తప్పుగా నడతు నీచెడుపోఁకలు మాన్పి మంచిగాఁ
బోవఁగ జేయువాఁడ నని మోటుతనంబునఁ బల్కె నల్కమై. 39

వ. అట్లు రాయండ ననుగరువంబున గ్రుడ్డివాఁడై మూడుచెడుగొనంబులఁ బెఱుఁగుచున్నయతనిచెడ్డమాట లాలకించియుఁ గడునోపిక గలిగి తెలివిచూపున వెలుఁగుచు నిద్దంపుబమ్మరూపై యెల్లబూతంబులలోన నున్నవాఁడు తానయై యున్నయన్నెలవేల్పు తన్నెఱుంగక కాఱు లఱచుచున్నయాతేనిం జూచి యిట్లనియె. 40

ఆ. పుడమిఱేఁడ నీవు నుడివినదంతయు
నిక్కువం బెడంద నిలిపి చూడ
నెట్టిబరువు లైన నీమేనికే గాని
నాకుఁ గలుగ నేర వాకళింపు. 41

వ. మఱియు లావుసన్నంబులు సుకము తెవులులు ముదిమిచావు లీను సంతసంబులు నిదురమేలుకొలుపులు నేను నాది యనుటలు లోనగు నన్నియు మేనితోడం బుట్టు దానితోడన పోవుఁ గాని నాకుఁ గలుగ నేరవు నేన కా దీజగ మంతయుం బ్రదికి చచ్చెడునట్టియదియే గావున నన్ను వేఱె యనం బనిలేదు. ఇతం డొడయం డీతండు బం టనునది

పలుతెఱఁగులపనులవలనంజేసి మేనులకుం గలుఁగుఁ గాని యుసురు
లకు లేకయుండు నని వెండియు. 42

భరతుండు ప్రతివచనం బిచ్చుట.

చ. దొరగరువంబున న్నిలిచి తోరముగా నను నీవు దూఱుచుం
గరగరిక న్మెలంగఁ దగుఁ గా యని నిచ్చ యొనర్పఁ బూన ని
త్తఱి వితకాని యింతయిన దానను మే ల్సమకూఱునోటు వే
దుఱయిన నాకడం జవిటితో నగునేలను విత్తు మొల్చునే. 43

వ. అని పలికి యోర్పుగలడెందంబుతో నాజడదారి తొంటిబాములయం
దలిపనులు మిగులుటంజేసి బరువునకు సైఁచి పల్లకి మోయుచుం
దొంటియట్లు జనుచుండె నపు డేఱుకఁ గోరి చనునాదొర డెందంబు
ముడి విచ్చునట్టియతనిపలుకులు విని తనయుల్లంబున. 44

శా. ఔరా! యేమిది వింత యయ్యో! నిటు లే నాడంగ నిం పొప్పఁగా
మాటాడెం గద యీతఁ డెవ్వఁడొకొ తా మార్మ్రనితో వచ్చి నా
కాఱుల్ సైచినగొప్పవాఁ డొకఁ డగున్ గాదంటిమా బోయలం
దేరీ యిట్టిరు కల్గిరే యొరులు నే నేమేమి పోల్లంటినో. 45

పటేలు భరతుని కాళ్ళపైఁ బడి పార్థించుట.

వ. అని దిగ్గన పల్లకి డిగ్గ నుఱికి యప్పుడమిదేవరయడుగులం బడి గరువం
బంతయుం దిగఁ ద్రావి చేతులు జోడించుకొని యి ట్లనియె. 46

శా. అయ్యా! యెవ్వఁడ వీవు? గోఁచియును లే కైనట్టివేసంబుతో
నియ్యాజం జనుచున్నవాఁడ వలమిన్నేర్ద్రాల్పవో వేల్పవో
నెయ్యం బొప్పఁగ నన్నుఁ దేర్చుటకునై నేఁ డిందు జూపట్టునా
నెయ్యుం డౌకపిలుండవో తెలిపి నానేరంబు సైరింపవే. 47

చ. ఎఱుఁగక మోఁతలో నిలిపి యెన్నియొ కాఱులు పల్కి దూఱియుఁ
గరకరి దప్పుఁ జేసితిని నాదగునేరము లెంచ కేలు మే
వెఱవను బ్రొద్దుచూల్గు దెకు బెద్దగరంబున కగ్గికిం గరం
బరయఁగఁ బాఱుతిట్టులకు నాత్రముతో వెఱఁ జెందినట్లుగన్. 48

వ. అయ్యా! నీవు తగులంబు విడిచి జడనువడినవడువున నుండి కప్పు
వడిన తెలివి కలిగి మెలంగుచున్నవాఁడవు నీపలుకులు పెనుమినుకుల
కుం బుట్టువై తలంచుటకును నుడువుటకును దరంబులు గాక యున్న
యవి నేను గఱివేల్పువోల్పునం బొడమిన కపిలునికడ బమ్మవిద్దె
తెలియం గోరి చనుచున్నవాఁడ నీవు మాఱురూపున నన్నుఁ బ్రోవ
వచ్చినకపిలుండవు గాఁబోలుదువు వెంబరవిత్తు లగునావంటిగేస్తులు
తపసిరాయలలోనికత లెల్లెఱుంగఁ గలరు నేను రాయఁ డనియెడు
గరువంబున విఱ్ఱవీఁగుచు పెద్దలం దూఱి గోడు మూటఁ గట్టికొంటి
నదినీయక్కటికంపుచూపునం దీఱుగాని యొంటం గాదు. ఎల్లర నొక్క
లాఁగునం జూచుమీ కీసు గలుగ నేరదు. అనదల మగు మాబోఁటి
వారిం జెడకుండఁ గాపాడు మనిన భరతుం డతని కిట్లనియె. 49

భరతుఁడు పఱేలునకు నీతులు చెప్పి జ్ఞానోపదేశము చేయుట.

మ. ఒడయండా! విను పెద్ద లీజగమునన్ హుళ్ళక్కిగాఁ బల్కుచున్
విడుపుంబేరిటితాన మొందుటకునై వేడ్క న్దగం గొందు రి
ప్పుడు నీవాడినమాట లెల్లఁ జదివెం బో యీతఁ డన్నట్టిపెం
పెడలె న్నీ వన నే ననంగ నెవఁ డే నేల్వాడనే నిన్నహో. 50

ఉ. ఈవు దిరంబుగా నిలువ నెంచితివే కద యీజగంబులోఁ
గావున నన్ను నెయ్యమునఁ గావుము సైఁపుము నేర మంచు లోఁ
గావరము దగన్ విడిచి కాళ్ళపయిం బడి వేఁడి తీవు మే
లీ విటఁ దప్పఁ జేసితివె? యెవ్వరి కెవ్వరు ప్రోచువారునున్. 51

క. పల్లకి మోయించుట నని, యుల్లంబున నుండఁ బోలు నోహో నీ కేఁ
దొల్లిఁటి చెయ్వులకతమునఁ, బల్లకి మోసితిని నీదుపని యిటఁగలదే.

క. కను గానక తొలిబాముల, నొనరించినవెల్ల వెనుక నొందఁగఁ దగు ని
ట్లన నొప్పఁగాని చేయిం, పను జేయం జాణయొకఁడు పరఁగునె చెపుమా.

వ. అని పలికి యూరకున్న వెఱఁ గంది యగ్గోఁచిపాతరాయనికి దండంబు
పెట్టి యారాయండు మఱియు నిట్లనియె. 54

మ. తెగులుం జెందుటఁ గుందుమానిసికి నెంతే మందు చందంబునన్
దగచే మిక్కిలివేఁగువారలకు నెన్నం జల్లనీ రట్లు పెం
పుగ నొసీనను పెద్దపాముకటువన్ బోల్పేది యున్నట్టినా
కొఁగి నీపల్కనుమంతరంబు తగనై యొప్పించె నో దేవరా. 55

ఆ. నన్నుఁ గన్నతండ్రి నాసందియము లెల్ల
నిన్ను నడిగి తెలియ నున్నవాఁడఁ
దనరఁ జెప్పు నేను దానైతి ననియెడు
దారి నెనరుఁ దోపఁ దపసిరాయ. 56

వ. అనిన నతం డతనిం జూచి రాయా! నీవు రాయఁడ నను గరువంబు
నం బల్లకు లెక్కి తిరుగుచుండుటయె కాని యెప్పుడుం బెద్దలపేరోల
గంబులం దిరిగి నేర్చి యుండినవాఁడవు గావు. ఎల్లయుసురుదాల్పుల
పిండునకున్ మనికి యగునీజగంబు బూటకంబున నొసరింపంబడియె
నిది నిక్కంబై యుండునది కా దని యెండియు. 57

తే. పుడమి నీవులచే నింటఁ బొసఁగుఁబనుల
వలన నెల నగ్గి ప్రొద్దులఁ గొలుపుచేతఁ
బ్రాఁబలుకులచే నెందుచే బమ్మ మరయఁ
దగదు పెద్దలఁ గొల్చినఁ దగినయట్లు. 58

క. ఓజమెయి నెపుడు పెద్దలఁ
బూజింపుచు మంచిదారిఁ బోయెడువాఁ డా
తేజునఁ బొలిచెడువిహుపుం
డాఁ జను నని ప్రాఁబలు కులతలలే వలుకున్. 59

మ. ఒడయండా! విను మేను దొల్లి భరతుం డోహో యనం బేర్మి నొ
ప్పెడుఱేఁడన్ దగులంబు వాసి యడవిన్ వేఁగించుచున్నాళ్ల లో
క్కెడ నీ రాడుచు లేడిపిల్లఁ గొని యెంతే ప్రేముడిన్ సాముటన్
బుడమిన్ లేడికిఁ బుట్టి యెండియును బాము ల్పొందితి న్వింటివే. 60

చ. వలమురితొల్వునందుఁ గడు బత్తి మెలంగుచు నుంటెఁ గాన నా
పాలు పఱియున్న మే న్విడిచి పుట్టితి నిట్టులు జన్నిగట్టునై
తెలివి యొకింత కల్గుటను దిక్కుల వెన్నుఁడు దక్క నొక్కఁడుం
గలుగఁడ టంచు నెంచుచు నొకండ మెలంగుచు నుంటి నిట్లుగన్. 61

వ. రాయా! యెల్లవారలు పెద్దలం గొల్చుటంజేసి తగులంబులం బెడఁ
బాసి తెలివి గలిగి సిరిచెలువునిం గొలుచుచున్న యెడ విడుపుం
జెందుదు రని మఱియును. 62

ఉ. ఇల్లనుకాఱుకానఁ దమ రేదియు కోరి మెలంగుచుండఁ దా
రల్లన వచ్చి కోర్కు లనునార్వురు దొంగలు పున్నె మన్న సొ
మ్మెల్లను దొంగిలించుకొని యేగినయంతట దిక్కులేనిదై
యుల్లము పల్లటిల్ల గొంగ లొందెడు మానిసిపిండు పొందుగన్. 63

తే. కాపురం బనునడవిలో నేపుమీఱు
నాలుబిడ్డలు నాఁబడునట్టినక్క
లెల్లఁ జెలరేఁగి మానిసియెముక లెల్లఁ
గొఱికి తిన వాఁడు పాడయి యుఱక చచ్చు. 64

తే. అడవిలోపలఁ గొఱవిదయ్యంబుఁ గాంచి
యగ్గి గొన వెంట నరిగెడుననువు దోఁప
నాలుబిడ్డలఁ బ్రోవ సొమ్మాసఁ జెంది
మెలఁగుఁ గలవారియిండ్లపంచలను వెడఁగు. 65

క. ఎడ నెండమావులం గని కడుదగ నీరాడునిచ్చఁ గాల్కొలఁదిం బా
ఱెడుమెకములవడువున, నవ్వెడఁగులు కాపురము సేయ వెడలెద రొడయా.

క. ముక్కాలిముడుక లైనను, ఒక్కము గడునిచ్చనేని రోయ కతనికిన్
జక్కనికన్నెల నమ్మెద, రక్కట పాలసులు వారి నజ్ఞమఁ డఁషఁచున్.

క. నీ కీకాని యొనంగెద నీకసుగందువును బట్టి కడతేర్పు మనం
బోకంత నందియుంపడ, కాకట్టిడి చంప నుండు నవ్వాని నయో. 68

క. కలుములుగలిగెడుననుచున్, దెలిసినయేఁ గన్నబిడ్డ నేఁ జెలినే
బాలియింపవెనుకఁదీయరుతులువలువారలక జనుఁడుదొసఁగుల్గూర్చున్.

మ. తెరువుల్గొట్టుచుఁ గన్నపెట్టుచును బ్రాఁతిం జూదమెప్డాడుచున్
దరిఁ దాటోటు లనెన్నియేఁ బలుకుచున్ దా రెంగిళుల్ మెక్కుచున్
బరికింపం గలయట్టి చెడ్డపనులం బాటించుచున్ రొక్కమీ
వరుసన్ బ్రోఁగులు వెట్టి దాఁప జెనఁటుల్ పాటంది పోకార్తు రా.

క. పులినంజుడైన మెసవుచుఁ, గలుద్రావుచు నోడలుమఱచి కన్గానక యొ
ప్పులవారిం దూఱెద రత్తులువల కిం దందు మంచిత్రోవలు గలవే.

క. ఇరుగుంబొరుగుల గరితల,వరుసయు వావియును లేక వడిఁజెఱచుచు నె
త్తఱి గండకావరమ్మునఁ దిరిఁగెద రవ్వారిపేరు దెలిపినఁ జెడు గా.

చ. చదివితిఁ గ్రైతఁ గట్టితిని చాల యసంబు గడించితిన్ ననున్
బదుగురు మెచ్చుచుండి రిఁక నాకుఁ బురుం డొకరుండు లేఁడటం
చెద గరువంబునన్ మెలఁగు చెంతల నేనియుఁ దండ్రి నేనియుం
గొదుగక దూఱుమోటకునకుం గొద లంటక పోవ వెన్నియేన్. 73

వ. మఱియు నట్టిదోసకారులొరులు దూఱిన వగచుచు నాఁకలింగొన్న వాఁడు గొడ్డుచెట్టుల నాసించునట్లు దొరలం జేరి కొల్చుచు దగఁ గొని నీరులేనిపాడునూతిం జేరినట్లు పాలసులం గూడుచు మేను గాలిన వాఁడు కాఱుచిచ్చుఱికినట్లు దాయలం జేరి బువ్వఁ గోరుచు సొమ్మనైన తల్లిదండ్రులు నన్నదమ్ములు లోనగుచుట్టంబుల నైనం బట్టి చంపుచు నిట్లు పెక్కుచందంబులఁ జెడుపనులవలనం బవళ్ళును నిదుర మొదలగువానివలన రేలునుం బోకార్చుచు నొండేమియు నెఱుంగక కాపురం బనుగడ్డిగప్పినపాడునూతఁ బడి యిడుమలం బడుచు వేఁగి వేఁగి తుదకుఁ జచ్చి జమునివలనం గొదలంబడుచుందు రని నెండియు.

ఆ. పనులకతన లచ్చి పెనిమిటిఁ దలఁపక
కాకి గ్రద్ద కొంగ గములతోడఁ

బురుడు వచ్చునాలిబూతంబు లను జెల్మిఁ
గలసి చెడును వారివలన నురక. 75

చ. తలఁచిన నోకిలింత లగుదట్టఁపుగెట్టను గొట్టుకొంచు బ్రేఁ
గులు నరము ల్పొర ల్తనదుకుత్తుకకు న్మెయికిం గడంకమై
దళముగఁ జుట్టఁ బెట్టుకొన దారి యొకింతయు లేక వేఁగుచున్
వెలలఁ దలంబె పో పొలఁతిపెన్గడుపన్ చెఱసాలయం దటన్. 76

తే. ఇరుకుత్రోవను వెలివచ్చుతఱిని యుక్క-
ముక్కలకుఁ బోనియెమ్ములనొక్కుటలకుఁ
బుట్టువాఁ డొందునంగద పోల్చి చూడ
వగపు పుట్టకపో దెట్టివానికైన. 77

క. గట్టా! పుట్టఁగ నగుని
క్కట్టులు వాఁ డెట్టియెట్టికట్టెఁడి యైనన్
జెట్టఁడు నాదాయకు నేఁ
బుట్టక పోవలయుఁ గాక పో యెకిమీఁడా. 78

చ. పుడమినిఁ బడ్డనాఁడునుత పోయెడుదాఁక గడేని సమ్మళం
బెడఁదకు లేక యాఁకలికి నేఁకటినిద్దుర కెందు కెందు కె
ప్పుడును మెలంగుచున్ జెడుగుపోఁకల నాళ్ళులు వెళ్ళఁబుచ్చుచున్
వెడఁగులు మిత్తివాతఁ బడి వేఁగుదు రాజమువీట నక్కటా! 79

మ. పదియాఱేఁడులపాయ మొప్ప మెయికిం బాటింప కెవ్వారినిన్
మదిలోఁ గావర మెప్డు పెచ్చి పెరుగన్ మానేదియు న్వావియున్
వదలంగాఁ బెరచేడెలం దగిలి దున్నం బోలి తాఁ జెడ్డయై
తుద కేపారును లేక చచ్చు వితగాదో వానిపుట్టిలికా. 80

చ. గరితలఁ బెండ్లియాడి చెలఁగన్ గొమరుల్ దగ నిల్లు దీర్చి కాఁ
పుర మొనరించుచున్ సుకము పొందెద మే మను సంతసంబుతోఁ
దిరుగుటె కాని దాన నగుతిప్ప లొకింతయుఁ గాన రయ్యయో
యరయఁగ గుండె జల్లు మను నయ్యవి వాకొనునట్టిపాటివే. 81

క. మడఁతులకే కొడుకులకే, జెడు గగుపను లబ్బెనేని చెప్పఁగ నవి య
వ్వెడఁగులవేయగువారలఁ, బడయఁగ నెవ్వాఁడుగోరు బాబూ! చెపుమా.

తే. అడరులేమిడి నైనఁ బేరాస నైనఁ
గడఁగి బొంకాడి యేనియుఁ గన్నపెట్టి
యేని కడు జూద మాడియే నెట్టులేని
సొమ్ము గడియించు నదె వానిసొంపు డింపు. 83

చ. బ్రతికినయన్ని నాళ్ళిటులు బాములకే యగుకాఁపురంబు నా
వితయగు పేరితోఁ దనరి వీఁగక మండెడుకారుచిచ్చులో
సతముగ నేగి వే మిడుతచందమున న్బడి వేఁగి వేఁగి యా
మతకరి చచ్చి పుట్టు నది మానెడుదారి నెఱుంగఁ బోలదో. 84

క. పిచ్చుంగుంటియు గ్రుడ్డియు
హెచ్చుగ నగుచెవుడు మూఁగ యొంతయు తెవులున్
వచ్చినముదుసలివాఁడును
జచ్చుచునుం గొమ్మఁ గవయఁ జను నాహాహా! 85

తే. చన్ను లపరంజికుండలు కన్ను లాణి
తమ్మ లొడలెల్ల బంగార మమ్మ యనుచు
నింతిఁ గోరు నంజుడుముద్ద లెసఁగుపుసుల
తొట్టిలును గుళ్ళు కు ళ్ళని తొలఁగ రకట. 66

క. పెనుబామువిసం బొడ లెక్కిన మందుల డింప వచ్చు గెరలెడిచెలిచూ
పనువిసము డిగక చెఱచున్, వినుమీ చెలిచూపువిసమొ విసమే విసమో.

వ. ఒరులకు నూడిగంపుఁబను లొయ్యనఁ జేసియు నేలఁ ద్రొవ్వియున్
జెఱువులనీరు తోలియును జేలను జెట్టులు బ్రోది వెట్టియున్
బరువడి నేమి లేక తను సాడగు మే నది పండుఁ గాని యె
ప్పరుసునఁ బండ కాస చిలవ ల్వలవ ల్గొనుచుండు నెప్పుడున్. 88

. తిన నాఁకు లలము లుండఁగఁ, గొన నేళ్ళ నీళ్ళు లుండఁ గొసరకకట్టం
జనునార లుండఁ బండం,గ నేల లుండ నొరుఁ గొల్వఁగా నేమిటికిన్,

ఆ. బ్రతుకు తరగలాట పసిజవ్వనము కొన్ని
నాళ్ళ మాట సుకము నీళ్ళమూట
బోఁటి సొమ్ము కొడుకు మేటిమెఱుపు తేఁట
యేటికయ్య! యిట్టిపాటిబాట. 90

చ. తెలియఁగ నెంతవారు నొగిఁ ద్రెళ్ళిర కాని యొకండు మిత్తిక
న్నుల మసిఁ బ్రామి పొల్చుట కనుంగొనియే వినియే నెఱుంగ మా
పొలిసెడునంతయున్ వినియు బూమె లెఱింగియు నుట్టిగట్టియు
య్యాల లిటు లూఁగుచుందు రని యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో.

చ. మిసమిసలాడుచుం దమకు మే లిడుచుండెడునంత దాఁక నే
పసఁ గొని బందుగుల్ గొలిచి వత్తురు లేమిడి జిక్కినప్డు రా
రుసు లెడలంగ మేను చెడి యున్నెడ నే మన నేవగించెడు
న్విసుగుగొనుం గడుం దెగడు నెచ్చెలియు న్ననరేది వింటివే. 92

తే. కాపుర మనుకడలి నీఁద నోఁపురారి
యెట్టిగొదలను దీర్చెడునట్టిదారి
పుట్టి చావని సుక మిచ్చునట్టిదారి
బమ్మ మరయుట యని లోన నమ్ము తేఱి. 93

చ. దళముగఁ గంటికిం బొరలు దాకకమున్న నొడ ల్వడంకుచున్
మలఁగకమున్న లోఁదెలివి మా నఱి పోవక మున్న కాళ్ళుసే
తులు సెడిపోకమున్న తగుత్రోవలఁ బోనగు నిండ్లు గాల బా
వుల నొగిఁ ద్రవ్వఁ బూనుటలు పోలునొకో తలపోసి చూడగన్.

వ. అని మఱియు బాటసారి యేచుఁగుం జూచుచు లోఁతునూతం బడి
చచ్చినతెఱంగునఁ గాపురంబునం గస్తిపడుచు నడుచువాఁడు జెడుం
గావున నీవు రాయఁడ నను గరువంబు విడిచి యన్నిటియందు సరి
యగుచెలిమి వాటించి తెలివి యనుకత్తిచేఁ దగులం బనునడవి నఱికి
మీఁదిద్దారిఁ దెలిసి మెలంగఁ దగునని వెండియును. 95

క. మన మన బమ్మం బనఁగాఁ, గనఁగొన వేఱెంత యేని గలుగదు సుమ్మీ
తనలోన నిట్లు తెలిసిన, తనుపో మఱి పుట్టి చాక తనరెడునతఁడున్.

ఆ. ఉసురు దాల్పులందు నెనఁగుమానిక మూక
దానియందుఁ దెలివి నూసినట్టి
తపసిరాయఁ డతని కెపుడుఁ జాలినవాఁడు
వేల్పు లేఁ డటంచు నిల్పు మీవు. 97

వ. ఆతపసి గోచియుం బెట్టక పిచ్చివానివలెం దిరుఁగుచుండు నతం డే
దేవర యతనిఁ గొలువ నన్నియుం జేకూరు నని యొఱింగించిన సంత
సించి యతం డతనికిఁ జాగిలి మ్రొక్కి యి ట్లనియె. 88

ఉ. పాఱుకొలంపుమానికమ! పట్టిపయిం గలగౌరవంబునన్
మీ రెఱిఁగించుసుద్దులను మీఱెననాచెడుబుద్ధియంతయున్
దీఱెను దోసముల్ నడిచెఁ దెల్వియు మించెను నాకొలంబునన్
జేరెను బున్నెమే విడుపుఁ జెందెద మీయడు గంటి కొల్చుటన్.

తే. నీదుపలుకను చందున నాదులోని
గరువ మనియెడుకటికిచీఁకటి దొలంగె
తెలివి యనుపండువెన్నెల తేఱె కాయు
దొంగ లార్వురు తిరుగక లొంగినారు. 100

ఆ. నీదుబోదఁజేసి నాదులోఁ గడుతెల్వి
నైన సంతసం బటనెడునిండు
చందమామ వొడిచె నిందందుఁ గలబమ్మ
మన్నసొమ్ముఁ గంటిఁ గన్నతండ్రి. 101

శా. మీఱం గావర మూరకే చెడఁగ నోమీబిడ్డ నన్ బ్రోఁచుటన్
మీరే తల్లులు మీరే తండ్రు లనఁగుల్ మీరే దొరల్ బందుగుల్
మీరే వేల్పులు మీరె యెల్లరును మిమ్మే నమ్మితిం జుండి లో
నేరు న్మీకును వేఱు లేరు గదె తండ్రీ యీనినిం గావుఁడీ. 102

వ. అని కడు దెఱంగులఁ గైవారంబుఁ జేసి వేడుక మెయి వీడుకోలు వడసి యతం డన్నియునుం బెడఁబాసినవాఁడ కాన వెంగలి యన నెటయేని యూడనిం బాడె నంత నాభరతుండునుం దనకు మేనుగలకర్జంబు దీఱెఁ గానఁ దొల్లింటి గండకివాఁకయొడ్డునకుం జని కూరుచుండి మెండ గుబత్తిందనడెందంబునం దనకువేలుగానివాని నిట్లని తలంచుచుండె.

చ. నలకలకన్న నల్కయి కనంబడి పెద్దలకన్నఁ బెద్దయై
నెల వొకచోటు నాక మఱి నింగియు నేలయు నిండఁ బొంగియున్
దులవలకెల్ల లే డనఁగఁ దోఁచెడుదేవర తాను నేన యై
వెలిఁగెడుజోతినిం దలఁచి వేయుఁదెఱంగులఁ గొల్తు నిచ్చలున్. 104

ఉ. ఈ వన నొక్కఁ డే ననఁగ నెంచ మఱొక్కఁడునే జగంబులో
నీ వన నే ననంగ నొకఁడే యగు సందియ ముండ దైన నిం
కీ వన నే ననంగ నుడు లేగక యున్నవి రెండు వానినిం
బోవఁగఁ జూచి నన్ను నినుఁ బొందఁగఁ జేసి కడంకఁ బ్రోవవే. 105

ఆ. తలఁపఁ జీమగోలె నలువవఱకు నంత
నీవ యగుచు నంత నీదులోన
నుండె నంతలోన నుండఁగ నీవు నీ
యంతఁ జేయుచుంటి వయ్య తండ్రి. 106

ఉ. నింగియు నేల గాలియును నీళ్ళును నగ్గియు నీదురూ పటం
చుం గలతొంటిమిన్కు లవి చొప్పడఁ జెప్పుచు నుండఁ దండ్రివై
పొఁగుచు నిజ్జగంబులను బొంది రవంత మెడంబు లేక నిం
డం గనుపింతు వం చనుట నాయముగా నినుఁ జేరి రెల్లరున్. 107

ఆ. మెఱుఁగుజోతి వోలె మెఱుఁగుచు నాలోన
నున్న నన్ను నేన యెన్నికొలుతు
నిన్ను మాఱు గాఁగ నీవు దిరుండవు
జగము దిరముగాని సరణి తెలిసి. 108

క. తలచుటకుం బలుకుటకుం దల మిసుమంతయును గానిదయ్యమ! నిన్నుం
గలసినకతమునఁ నేమో, తలఁచుచునుంటిని వెలుంగుతలఁపున జేజే.

వ. అని పలుదెఱంగులఁ దలపోయుచు దివ్వె దివ్వెం గలసినట్లు బమ్మం
గలసి మెలసి మెలంగుచుండె. 110

క. అని శుకుఁడు పరీక్షిత్తున,కును దెలిపినయట్లు శౌనకుఁడు మొదలగుబా
పనఱేండ్ల కిట్లు సూతుఁడు,వినిపించెన్ భరతుకతను వేఁడుక మీఱన్.

క. భాగవతంబునఁ గలకత,బాగుగఁ దిలకించి యిట్లు వ్రాసితి దీనిన్
వీగక చవిన వినినన్,వేగమ సమకూరు తెలివి వెడలని సిరియున్.112

ఆశ్వాసాంతము.

మాలిని. కుదు రెపు డగురాయా! కూళరాకాసిదాయా!
మొదటఁ బాడమునయ్యా! ముజ్జగం బేలుజియ్యా!
చదువుపజలపట్టా! సాదుచున్నట్టిదిట్టా!
పెదతపసులప్రాపా! పేర్మిమై నుండుమాపా! 113

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబయిన బ్రహ్మానంద మను
నచ్చ తెలుఁగు ప్రబంధంబున సర్వం
బును దృతీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

# పంచరత్నములు.



క. శ్రీపీఠికాపురీశ్వర, గోపాలకృపావిశేషగుణభూష ధరి
త్రీపాల వినుతవిభవ, వ్యాపక శ్రీసూర్యరాయ వరకవిగేయా.

మ. అల గంగాధరభూధరేశ్వరవరాత్మాంచత్కుమారుండవై
విలసచ్ఛాస్త్రముఖప్రసక్తిని జగద్విఖ్యాతిమై నొప్పి భూ
తలమం దున్నతశక్తిఁ దాల్చి కలుషార్థగ్రావభేదంబు పే
రలుకం జేసి యశంబు గంటివి కుమారా! పీఠికాధీశ్వరా.

మ. పరిషద్దక్షిణ వేసవే లిడి కళాభవ్యాంధ్రభాషాంతరాం
తరదోషంబు లడంగిపో సుకృత మేతద్భూమిభాగంబునన్
స్థిరతం జెందఁగఁ జేసి తట్టై విజయశ్రీపీఠికాపట్టణే
శ్వర! నీ విప్పటి కృష్ణరాయఁడవు గావా సూర్యరాయండ వా.

మ. పసివాఁడై తగునప్డె తండ్రియును నాపైఁ దల్లియుం బోయిన
న్మిసిమింతుం డయి రాజకీయములఁ బేర్మిం గెల్చి ధర్మస్థితిన్
వసుధారాజ్యభరంబుఁ బూని సుకవివ్రాతంబు లగ్గింపఁగాఁ
బస మీఱం బ్రజ నేలు రావుకులరాడ్వర్యుండు సామాన్యుఁడే.

చ. సహజగుణంబు శాంత మది స్వాంతమునం బొలు పొంద దాయనే
సహనమునం గనుంగొనుచు సంతతముం గరుణార్ద్రచిత్తుఁడై
మహిపతి యైన వేంకటకుమారమహీపతిసూర్యరాయఁ డి
మ్మహి నిరమిత్రుఁడై నృపతి మండలమండితుఁడై తలిర్చుతన్.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.



